గీ. యౌవరాజ్యాభిషేకత నలరఁజేయ, నిచ్ఛయించెను దశరథనృపతిప్రీతి
నటు జరుగుచుండి సతి దేవి యైనకైక, రామునభిషేకసంభారరాశిఁ జూచి
పూర్వపరిదత్తవరయాటంబూనితాను, దశరథేశ్వరుఁగనియీవిధమునఁగోరెఁ
జనుట రాముఁడువననివాసంబుసేయ, భరతునకునభిషేకంబుజరుపుట" యని

పైమూఁడుపొత్తములును సంస్కృతశ్లోకములతోఁగూడఁ బ్రకటించి యుండినచోఁ జదువుకొనువారికి భాషాంతరీకరణాములు సులభముగ బోధపడుచుండెడివి.

---

8. ఆత్మార్పణము—కర్త- తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు. కావూరు, గుంటూరుజిల్లా. ఇందలికథ భారతము శాంతిపర్వములోని లుబ్ధకకపోతచరిత్రము. ఇది యొకప్పుడు భారతీపత్త్రికలలోఁ బ్రకటింపఁబడినది. దానిని ప్రత్యేకముగాఁ బుస్తకరూపమునఁ బ్రకటించిరి. ఇదివఱలో నీకథ ననేకులనేకవిధములఁ బద్యరూపమున రచించిరి. వారిలో వీరి దొకత్రోవ. చక్కని కాగితములమీఁద మంచియచ్చున ముద్రింపఁబడినది గాని, పద్యములపేళ్ళు గాని, సంఖ్యగాని చూపఁబడకపోవుట కొంతపాఠకులకు శ్రమను గల్గించును. మాకుఁ బంపినప్రతిలో ముద్రణమునందు గొన్నిసవరణ లున్నవి. ముఖపత్త్రము లేదు. వెల లేదు. దీనింబట్టిచూడ నింకను బుస్తకములు ప్రచురింపఁబడలేదని తోఁచుచున్నది. కవిత్వము ధారాళముగానున్నది. సాధ్యమైనంత నిర్దుష్టముగా నున్నది. ఒక్కపద్యము చూడుఁడు.

సీ. శబ్దార్థములభంగిఁ జంద్రికాచంద్రుల ట్లన్యోన్యమైత్రి నొప్పారుచున్న
మనకాఁపురంబుఁ గన్గొన మాలవిధికెంత కన్నుగుట్టెనొ జగత్కంటకునకు
అడవి మేఁతల మేసి వడియనీళులఁ ద్రావి పరులసొమ్ముల కాసపడక యొరుల
కొకకీడుఁజేఁతయు నొనరింపక మెలంగు మనజీవితము దైవమున కదెంత
భార మయ్యెనొ పాపంబు పండెనిట్లు
విధివిధానంబు నెదిరించువిధము గలదె
కటకటా నేఁటి కెట్టిసంకటము వచ్చె
నెట్లు దీని భరింతు దిక్కెవ్వ రబల.

9. శ్రీవైష్ణవతిరుమాళిగ-కర్త- శ్రీ॥ శే॥ ఎ౯-హూరత్తాళ్వారు అయ్యంగార్-(తిరిచినాపల్లి సెంజోసెఫ్ కాలేజి తెలుఁగుపండితుఁడు) “ఇదియొక భారత సంప్రదాయగ్రంథము. ఇందు యజమానుని దినచర్య, ఇంటియందలివారలు తనయిష్టానువర్తిగ నడచునటులఁ జేయుట, విద్యాభివృద్ధి స్త్రీబాలవృద్ధవివక్షత లేక అందఱును సకాలక్రమముగ నధ్యయనముచేయుట మొదలగువిషయములచే మృదుమధురశైలియందు వ్రాయఁబడియున్నది. భారతవిలక్షణమును దెల్పును. ఇది భారతీయు లందఱుఁ జదువఁదగిన గ్రంథము. అందఱికి వాక్కుగలదు” అని ప్రకాశకులు వ్రాసిరి దీనివెల రు 0—2—0 ఎ౯. కే. పరుశాభరణముగారు, 22 పచ్చయప్ప మొదలివీధి, కోమలేశ్వరముపేట, చెన్నపురిలో దొరకును.

---

10. పతివ్రతావిభవము- ఇదియును బైకూరత్తాళ్వార్ అయ్యంగారిచే రచియింపఁబడినదియే. వెల రు 0-6-0 “ఇది మహాపతివ్రతామాహాత్మ్యము. ఇందు పతిభక్తిని ప్రధానముగా గొని ఆవ్రతమును ఏలోపములేక ఆముక్త్యంతము జరిపి స్త్రీపురుషుల కిరువురకును బ్రహ్మలోకపదవిని ప్రాపించిన యిరువదినాలుగు పతివ్రతలచరిత్రలను శబ్దకాఠిన్యము వదలించి అన్వయకాఠిన్యమును, కష్టము లగు సంధులను మాన్పి నవరసభరితము లగు శబ్దాలంకారములతోను ప్రసిద్ధలఘుసమాసములతోను దీర్ఘసమాసములను దప్పించి చదువువారికిని రుచికరముగాను మనోహరముగాను విరచింప యత్నించితిని...ఇందు శబ్దదోషములు సాధ్యమైనంతవఱకు రాకుండునట్లు సమర్థింపఁబడును... ఇందలి చరిత్రలు వేదవేదాంతభారతరామాయణపురాణగ్రంథములనుండి యేర్చికూర్చబడినవి” అని కవిగారు తెల్పిరి.

---

11. బ్రహ్మసూత్రసారసంగ్రహావిమర్శనము:—శ్రీ॥ శే॥ ముట్నూరి గోపాలదాసుగారిచే రచియింపఁబడినది. దీని పీఠికలో గోపాలదాసుగారు “శ్రీవేదవ్యాసవిరచిత బ్రహ్మసూత్రములకు శ్రీశంకరయతీంద్రులవారును, రామానుజాచార్యులవారును భాష్యమును వ్రాసియున్నారు... వేదాంతతీర్థ వేదాంతవాచస్పతి...శ్రీమాన్ కందాడై శేషాచార్యులుగారును, రాయబహదర్ శ్రీవద్వల్లూరి జగన్నాథరావుగారును సరి అయిన ఆంధ్రవ్యాఖ్యానము వ్రాసియున్నారు. వాటిని నేను కొంతవరకు చూచినాను. అందు రామానుజాచార్యులవార

వ్రాసిన వ్యాఖ్యానములో ఏదిసర్వోపనిషత్తులచేతను పరబ్రహ్మ మని ప్రతిపాదింపఁబడి అద్వైతులచేత కొనియాడబడుచు అనేక గ్రంథరాజములందు వ్రాయబడియున్న ప్రత్యక్చైకత్వమును చేతనుఁడైనను అనంతదుఃఖములకు పాత్రుఁడై దాదాపుగా ఒకమిరుగుతుపురుగువలె ఉపమాన మిచ్చి ప్రత్యక్చైతన్యమునకు పరబ్రహ్మమునకును సంబంధము లేదని వ్రాసినారు. జీవేశ్వరులకుగల భేదశ్రుతు లన్నియు యీప్రత్యగాత్మపరవాక్యములకు సమన్వయించి వ్రాసినారు. చాలావిపరీతము తోఁచబడి నేను యీసూత్రములకు తగిన అర్థమును శ్రుతిస్మృతులచేతను వ్రాసియున్నాను." అను మొదలైనవి లిఖించిరి. గోపాలదాసుగారు తమరు రచియించిన యీగ్రంథము ముద్రణములో నుండఁగనే కాలధర్మమునొందుటకు మే మెంతయు చింతిల్లుచున్నాము. కాకినాడ ముట్నూరి చిదంబరశాస్త్రిగారియొద్ద దొరకును. దీనివెల రు 0—8—0.

---

12 రామనిర్యాణము- నాటకము. గ్రంథకర్తలు బ్ర॥ రామకృష్ణసుబ్రహ్మణ్యకవులు. (గోరావఝ్ఝుల రామకృష్ణశాస్త్రిగారు, అక్కపెద్ది సుబ్రహ్మణ్యశాస్త్రిగారును) వీరు తిరుపతి వేంకటేశ్వరకవుల శిష్యులఁట. వీరిలో సుబ్రహ్మణ్యకవిగారు సంగీతసాహిత్యములను, అవధానప్రజ్ఞను గడించినవారు, చిత్రపుకాగితపుబనులు, అర్హోదయములు, వేణుగానము, మొదలగునవి గురుశుశ్రూష చేయకయే నేర్చిరఁట. ఎంతటికఠినపద్యమైనను వినినంతనే మరలఁ జదువఁగలనేర్పుగల్గినవారఁట. ఇట్టి మేధాశాలి కీర్తిశేషులయినట్లు తెలియుచున్నది. ఈనాటకము 5 అంకములు గలది. ప్రత్యంకమున రంగవిభజనము చేయఁబడినది కథ పేరువలననే తెలియవచ్చును. ఉత్తరరామాయణము. ఇంద్రాదిదేవతలు శివుఁడు మొదలగువారు రాముని వైకుంఠమునకుఁ గొనిపోవ యత్నించుట. యముఁడు మునివేషమున రామునికడకువచ్చి బ్రహ్మరహస్యమును జెప్పుట. ఆమాట లితరు లెవ్వరు వినఁగూడ దని ముని చెప్పుట. రాముఁడు—

చ. శరణని దేవదేవుపదసారసయుగ్మము నంటుగాక సా
గరమునఁ గ్రుంకుఁగాక సురకాండమొ యస్త్రము వచ్చుఁగాక మే
మిసుపుర మాకుమాటలు నొకించుక విన్నను గన్నవాని మ॥
స్వగనిశితాసిధారలను ఖండనఁజేతు దయావిహీనతన్.

అని ప్రతిజ్ఞ చేసి లక్ష్మణుని ద్వారముకడ నెవ్వరును రాకుండఁ గాపుంచుట. అంతలో దుర్వాసముని వచ్చి రామునిఁ జూడఁగోరుట, లక్ష్మణుఁడు మునికోపమునకు వెఱచి రామునొద్దకు రహస్యసమయములో నేగుట మొదలుగాఁగల కథ యిందువర్ణింపఁబడినది. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రచించిన సందర్భోచితములగు కీర్తనలు తుట్టతుదఁ జేర్చినారు. కవిత్వము సందర్భోచితముగ నున్నది. "పాటలాధరరంభఁ బంపఁగావలె నాదుపడకకనుచు" రాముఁ డన్నను మోటుగానే కనఁబడుచున్నది. "తనవిడిదికి రంభ ననుపవైతి" అని కిగ్గాడియసుర చేత సూరన్నగారు గూఢముగాఁ బల్కించిరి. అభిప్రాయభేదము లుండవచ్చును. శ్రీరామనిర్యాణము విషాదాంతము కాకపోదు.

ఉ. తమ్ముఁడవైతి పుట్టుకను దాసుఁడవైతివి సేవచేతఁ గా
ర్యమ్ము వరింపఁ బట్టఁ బరమాప్తుఁడవైతివి రాజనీతి వా
క్యమ్ముల నాలకించుతఱి నైతివి శిష్యుఁడ వట్టి నీదు కం
ఠమ్మును జేతులార నకటా వధియించి సుఖింపనేర్తునే.

ఇందుఁ గంఠమ్మును వధియించి యనుటకంటె "తెగవ్రేసి" అనుట యుక్తమేమో.

మ. హరకోదండవిఖండనోద్భవజయశ్శ్యామామనోహారిభా
స్వరహస్తగ్రహణోత్సుకాయ విధవే సద్భక్తహృద్వాసినే
ధరణీజాకుచకుంభలిప్తవిలసత్కస్తూరికాసౌరభో
త్కరసంవాసితవక్షసే నమ ఇదం కల్యాణసంధాయినే.

చ. వయసు గతించె నీధరణిభారముఁ దాల్పఁగశక్తిలేదు ని
ర్దయ నిదె మృత్యుదేవత కరాళము విప్పి గ్రసింపనుండె నా
ప్రియమగు తమ్ముఁడా మడసెఁ బెద్దలుగూడ నసించి రింక నో
నయవిదులార యేలఁదగు న్యాయము దప్పక కోసలావనిన్.

మ. అదియే కోసలదేశభూషణ మయోధ్యాపట్టణోత్తంస మ
ల్లదియే రామనివాససౌధ మవె రథ్యల్ వారలే పౌరు ల
ల్లదె మత్తేభతురంగగోష్ఠ మదె క్రీడారామ మయ్యారె నా
కిది దర్శింపుటకన్న భాగ్యమిఁక వేఱేలేదు తర్కింపఁగన్.

"బలిమి ధన్వాంత్రిని బాధించు" "ఏఘను రాత్రిఁ బవళ్లుప్రశంస సేతురు" ధన్వాంతరి యనియు రాత్రిందివములు అనియు నుఁడినభాగని తోఁచుచున్నది- "కరాళమువిప్పి గ్రసింపనుండె" కరాళమును విశేషణముగాఁ జేయుట మాకిష్టము. "మత్తేభతురంగగోష్ఠము" మత్తేభములను దురంగములను గట్టునవి గోష్ఠములనుట ప్రౌఢమేమో కాని స్థలోచితముగానుండునా! "తారకలే రసబుడ్లు గాఁగ" ఇందుఁ బ్రమాదముండవచ్చును.

కవులు "మేమీపొత్తమును వ్రాసినవెంటనే యచ్చొత్తింపుట తటస్థించినది. దానిచే దీని నితరకవులకుఁ బండితులకుఁ జూపి లోపాలోపములను సవరించుకొను నవకాశము లేకపోయిన దనిరి. కావున మాకు సందేహములుగానున్న తావులు సూచించితిమి.

ఈగ్రంథము కావలసినవారు గుంటూరుజిల్లా, అనంతవరము, రామకృష్ణ సీతారామకవులకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

వెల 0—12—0.

---

## విజ్ఞాపనము.

---

ఈసంచికతోఁ బాఠకులకు 18 వ సంపుటములో మూఁడుసంచికలందియుండును. దయచేసి తాము పంపవలసిన చందాలను వెంటనే పంపుదురని కోరుచున్నారము. అందఱును గూడ నొక్కొక్క సంవత్సరము చందా తప్పక పంపినచోఁ దత్కాలమునఁగల యిక్కట్టుగొన్ని పాయును. పాఠకులభాషాభిమాన మీసమయమున విశదము కావలయును.

కా॥ అ॥

ముసలముద్గరశూలములుమాన్పిచకుమకీబందూఖులుధరింపఁ బాటిసేయు
పరుష గీర్వాణము ల్వదలించి వేవేగఁ దురకమాటలు నేర్చు కలికి మీాఱి
మీారు దేవత్వము వహించి మీా(ఱలేరు)
*మీారలునునొంకవిధమున రాదు, భద్ర. ౫౮
సూకరరూపంబు సూచనవినిగదా విడిచిపెట్టిరి మిమ్ము వెరవెఱింగి
బలి బిచ్చమెత్తిన బాపండ వని కదా విడిచిపెట్టిరి మిమ్ము వెరవెఱింగి
ఢిల్లీశ్వరునకైన యల్లుండ వని కదా విడిచిపెట్టిరి మిమ్ము వెరవెఱింగి
పాఱిపోయెడివారిఁ బట్టరాదని కదా విడిచిపెట్టిరి మిమ్ము వెరవెఱింగి
కాకయుండినఁ దురకలఁ గడచిపోవ
గలరెమీావంటివారలు క్రమముతోడ, భద్ర. ౫౯
శేషావతారవిశేష మెక్కడఁబోయె లక్ష్మణార్యునకు నలక్షణముగ
శంఖచక్రాన్వయసంజ్ఞ యెచ్చట జెల్లె భరతశత్రుఘ్నుల కరయ భువిని
లోకమాత్రాఖ్యయేలోకంబులకుఁ జేరె భూపుత్రికిని నెన్న భూమిలోన
నాదినారాయణాహ్వయ మదెందులకేగె రామాఖ్యగలమీాకు రమణతోడఁ
దురకలెల్లను దోరవని నరకుగోనక
మండపాగారముల మట్టుమసలి రహాహా, భద్ర. ౬౦
చిక్కులు నిమురక సీతోర్మికాదులఁ గని యూరకుందురే మనసునిలిపి
పాఱిపోవఁగనైనఁ బట్టలు నాకక విడుతురే వైష్ణవవితతినెల్ల
బందూకులు బుజాలపై నిల్పి కొనిపోక (యరుగ) నిత్తురె వసిష్ఠాదిమునుల
ముక్కులుగఱవనీ మును మొనగట్టి పోనిత్తురే కపినాయకోత్తములను
మొగలుబచ్చాల కగపడఁదగదటంచుఁ
దొంగిపోయితి రికనేటిదొరతనంబు, భద్ర. ౬౧
పురలక్ష్మి నురవడిఁ జెఱపట్టి గిడులో వనలక్ష్మి కరపల్లవములు నులిమి
గంగను గదిసి వేగమె ధైర్యలక్ష్మిఁ జేకొని ధనలక్ష్మి చెట్టపట్టి
రాజ్యలక్ష్మిని సంగరమునఁ బెండిలియాడి ధాన్యలక్ష్మిని సరదార్ల కిచ్చి
ఘనగజాంతలక్ష్మి గైకొని వేవేగఁ గీర్తికాంతకుఁ గులగురుబోనంగి
నట్టి"దంసాను"శిక్షింప నలవిగాక
యుడుగుకొంటివి నృపతులఁగడుపుకొలికు, భద్ర. ౬౨

---

*మీారులను రొండ్లువిధమున ననరాదు—మా.

హరువిల్లు విఱువక వరపుత్త్రి నీయనన్న జనకరా జేమి విచారపడెనో
పరశురాముని భంగపఱుపఁగా నొచ్చిన దశరథుఁ డేరీతిఁ దల్లడిలెనో
మిముఁ గాపుచేసి యాగము పూర్తిచేసిన కౌశికుఁడేమివ్యగ్రతగాసియెనో
వనరాశిఁ గట్టి రావణుఁ ద్రుంచఁగనిన విభీషణుం డేరీతి వగదుపడెనో
తురకబలకోటి(గాంచి) కూతురతఁ బోల
వరము వేంచేసినట్టిదుర్వార్త వినిన, భద్ర. ౬౩

వయసఁ గోడలి దురవస్థలు విన సారెఁ గౌసల్య యేగతి గాంచెనొక్కో
మీాశ్రమ మెల్ల సుమిత్ర యాలించి గాసిలి దుఃఖవారాశిఁ జేరెనొక్కో
కలకాల మీారీతిఁ గడపఁగాఁ గాలంబు విని విందు లేమని వెఱచిరొక్కో
గతకాలమునఁ బండ్లు కానుక లిచ్చిన శబరి యేగతిఁ జింత సలిపెనొక్కో
యహహ భద్రాద్రినుండిమీారరిగి పోల
వరము వేంచేసినట్టి దుర్వార్తవినియు, భద్ర. ౬౪

ఆదిభిక్షునిఁ బెండ్లియాడిన పార్వతి కన్నవస్త్రముల కేమాపదయ్యెఁ
గౌరి బాఁపనిఁ జేసికొన్న సరస్వతి కిడుములు వచ్చెనే యిల్లు లేక
కాళ్ళు లేనిఫణీంద్రుఁ గట్టికొనిన యుర్వి కూరు లేదాయెనే యుండుటకును
దనువు లేని వయారిఁ దగిలిన రతిదేవి సుఖపడ దాయెనే సురలు మెచ్చ
బళిరె మీావంటిప్రభుచేట్టవట్టి సీత
సకలవెతలకు లోనయ్యె సరవిలోన. భద్ర. ౬౫

పాయగిండ్ల వెంబడిఁ దిరుగుచునుండు లక్ష్మీదేవి కేమపకీర్తి వచ్చె
సభలలో నెప్పుడు సంచరించుచునుండు వాణి కేమపవాద వచ్చెజగతి
వేలార్లు మనువుల కాలయుమైయున్న భూదేవి కేమితప్పులు ఘటిల్లె
శివునిఁ బాసి సముద్రుఁ జెందిన పార్వతిసవతి కేమాడిక ల్సంభవించెఁ
దోడు నీడయి మీా వెంట గూడియున్న
సీతదురవస్థ లేమని చెప్పఁదరము, భద్ర. ౬౬

జనకుఁ డిచ్చిన బన్నసర మటంచును జూపి తెల్పు సీతామహాదేవి యిష్ట
జనులతో నూర్మిళ తనతల్లియొసఁగిన పచ్చలతాళిని పల్కుఁ బ్రాణ
సఖులతో మాళవి సరవిఁగెంపులనత్తు గని మురియు, బంధు
వర్గంబుతో జాళువావల్వ శ్రుతకీర్తి మేనమామయొసంగె మిథిలయందు
ననుచుఁ గొనియాడుఁ బుట్టింటిఘనత మెఱయ
వారి నరీతి సోదార్పవశము మీాకు, భద్ర. ౬౭

గజరాతికొంపులకుం బెట్లు చెవుల ధరించదా మోఁ గదయ్యా వాంఛదీర
వరుణదేవుఁ డొసంగు వజ్రాలకమ్మలుం బెట్టదా మోఁ గదయ్యా ప్రేమదీఱ
నలకుబేరుఁ డొసంగు నద్దాలఅవికె పైఁ దొడుగదా మోఁ గదయ్యా యొడలునిండ
గట్న మింద్రుఁ డొసంగు గంటలమొలనూలు కట్టదా మోఁ గదయ్యా కాంతుఁదీఱ
వేడ్క దినముల నడవులవెంట (మీరు)
ద్రిప్పితిరి సీత నూరకె తప్పులేక, భద్ర. ౬౮

తెచ్చితికీర్తిఁ గీర్తివిశారదులగు నిక్ష్వాకువంశోద్భవఘనులకెల్ల
నేలితి వవనిలో నెలమి శంకరగిరి హానను బాదాలు మహాత్మ్యతముగఁ
దోలితి వరుల హద్దులు దప్పిరాకుండ భక్తకోటికి ముగ్ధభావ మలర
... ... ... ... ...
ఏమి వర్ణింతు మీపాత్ర మేమనంతు
లోకు లెఱుఁగంగ నీయూ పుశ్లోకములను, భద్ర. ౬౯

అలపాకశాసనునైన ననుయాచించి చేయించు ముత్యాలచేరుచుక్క
రమణతోడుత ధర్మరాజుకు దయవుట్ట నడిగి చేయించు ముత్యాలసత్తు
వరుణదేవునినైన వరుసతోఁ బ్రార్థించు కలకొద్దిఁ జేయించుఁ గమ్మజోడు
రాజరాజును (వేఁడు) తేజంబుతోడను నిప్పించు సవరపుఁగొప్పు ముంచు
పేదపోణుము లివిమైనఁ బెట్టుకున్నఁ
జూపరులకెల్ల నత్యంతచులకఁదనము, భద్ర. ౭౦

ఇల్లు నప్పులగంప యిల్లాలు చలచిత్త పాన్పునాగులపుట్ట వదినె జెట్ట
గొల్లపెంపుడుతల్లి కోడలుతాఁగ కూఁతురు పాఱుఁబోతు నాతురుఁడు సఖుఁడు
మనుమఁడుతంత్రి కాముకుఁడు కుమారుండు క్షయరోగి మఱఁది వంచకుఁడు తండ్రి
యన్న పానఘనుండు నరయనిష్టుఁడు పేఁడి వేసదారివి నీవు వేయునేల
యిన్నియును నాదునెమ్మది నెఱిఁగియుండి
కొలిచితిని మిమ్ము విశ్వాసగుణముదలఁచి, భద్ర. ౭౧

పన్నీరుసీసాలఁ బరఁగ నించినరీతి నెనయఁగప్రపుమూ రెత్తుభాతి
వరుసముత్యాలకోవలు గ్రుచ్చినక్రమంబు మల్లెపూసరములు మలఁపుమాడ్కి
విరజాజిపై సుధావృష్టి దోఁగినగతిఁ గస్తూరి వీణెయల్లలుపుపోల్కి.
పరఁగనవదాతు (?) గంపలు పంపినవిధంబు తేనె బానలు తెరల్దీసినట్లు

నీదు నామామృతంబు నానేర్చినంత
కొల్లలాడెద భక్తులు నుల్లసిల్ల, భద్ర. ౨౨

సర్వముఖాసాలు చాలని మీ కిలఁ గట్టడి నేరీతిఁ గడచెనయ్య
బహ్వవసరముల భక్షించు మీ రెట్టు లొక్క ప్రొద్దున కోర్చి యుంటిరయ్య
సంగీతసాహిత్యసద్గోష్ఠిగలవార లొంటి మీ రెట్లొదిఁ గుంటిరయ్య
తిరువీధు లెడవక తిరిగెడు మీ రెట్లు కడపదాఁటక ప్రొద్దుగడపితిరహ
వాహనంబులపై నుండువారి కకట
రోడపై నక్కఁగానెట్లు గూడెనయ్య, భద్ర. ౨౩

పదియురెండేఁడుల ప్రాయంబువాఁడవై మించుతాటకను శిక్షించు టెట్టేఁగి
రణశూరు లగుదైత్యగణములఁ బరిమార్చి కౌశికు జన్నంబు గాచు టెట్టేఁగి
తరములఁబట్టి యెత్తఁగరాని హరువిల్లు చెఱకుకైవడి నట్లు విఱుచు టెట్టేఁగి
సంగరరంగవిశారదుఁడైన భార్గవరాము నవలీలఁ గడపు టెట్టేఁగి
దూఱితిని మిమ్ము రోషంబు దొట్టి రిపుల
మదమడంగించునట్టి సన్మదమెలర్ప, భద్ర. ౨౪

ప్రారబ్ధ మనుభవింపనిభక్తజనముల యాతనల్ త్రుంపఁగ మీ తరంబె
కారణహేతువికారము ల్తప్పించి యధికులఁ జేయ మీ కయ్యతరమె
మిముఁ దొల్లి పూజించి మీ వరంబులు గొన్న ధంసాను గావ మీ తాతతరమె
గతజన్మమునఁ బెట్ట గతిలేక పుట్టిన దీనులఁ బ్రోవ మీ దేవుతరమె
యనుచు జనులెల్ల మిము నాడ వినఁగలేక
దూఱితిని నాదు నేరముల్ తొలఁగఁజేయు, భద్ర. ౨౫

ఈతనా ధంసాకు నెదిరి పోరఁగలేక పాఱిపోయిన రామపార్థివుండు
ఈతఁడా యరికి వెన్నిచ్చి పోలవరంబు దారిఁజూపిన సుమిత్రాతనూజుఁ
డీబిడా కలసొమ్ము లిచ్చి మ్లేచ్ఛుల బాధ పతికిఁ దప్పించిన పడఁతిమిన్న
యీతఁడా పగదళం బిదె వచ్చె నని చూపి భయముపుట్టించినపావనియని
పల్లుదురుసామి మిముఁ జూచి ప్రజలు కార్య
వరుస యెఱుఁగక కోపింప వలదుతండ్రి, భద్ర. ౨౬

పిఱికివాఁ డంటేఁగా కఱకుదానవులను గర్వమడంచిన ఘనుఁడ నిన్ను
లోభివాఁ డంటేఁగా లోకంబు లెఱుఁగంగ లంకదానముసేయు రాజ నిన్ను
బలహీనుఁ డంటేఁగా బలిమి సముద్రుని బాణాగ్రమునఁ గల్పుజాణ నిన్ను

వెఱ్ఱివాఁ డంటిఁగా వెరవెఱుంగని క్రోఁతిగములచే వారిధి గట్టినట్టి
నిన్ను లోకోపకారార్థ మెన్నెఁబూని,
దూఱితిని గాక మీవంటి దొరగలండె, భద్ర. ౭౭

అలకుచేలుని చేరెఁ డటుకులు భక్షించి సంపద లొసఁగిన సరసగుణుఁడ
గజరాజు మొసలిచే గాసిలి మొఱవెట్టఁ గాచి రక్షించిన కమలనాథ
కలఁడన్నఁ బెన్నుక్కుఁగంబంబులోనుండి వెడలి బాలుని గాచు నీరజాక్ష
తలఁచిన ద్రౌపదితలఁపు వెంబడి మానభంగంబు గాచిన ప్రభువరేణ్య
లోభివంటిని బగరకు లొఁగితంటిఁ
బిఱికి వంటిని నేరక యుఱికితంటి, భద్ర. ౭౮

వగతుఁడై బహుఫణార్భటిఁ జేర వచ్చిన కాళీయుదైత్యుని గావలేదె
సీతను జెఱగొన్న పాతకాగ్రేసరునవజుని శరణన్న మనుపలేదె
మీశరణార్థియై మెలఁగి కావు మటన్న కాకాసురునితప్పు గడపలేదె

* * * * * * *

పృథివి శరణాగతత్రాణ బిరుదుగలుగు
దొరవనుచు నిన్నుఁ బలుమాఱు దూఱినాఁడ-భద్ర. ౭౯

పితృకార్యమునకునై పినతల్లి కోరికి వెఱవక తీర్చిన వేల్పు నిన్నుఁ
బదరేణువ నహల్య పాషాణంబు బెడఁబాపి విభునిఁగూర్చిన సత్యవిభుఁడ నిన్ను
దగఁ గన్నఁ బగవానితమ్ముని లంకలోఁ బట్టంబు గట్టిన ప్రభుడ నిన్ను
ఘను సుబాహుని బట్టి ఖండించి కౌశికుసవముఁ గాచిన సర్వసముఁడ నిన్ను
భక్తలోకోపకారార్థపరుఁడనగుచు
దూఱితిని నాదు నేరంబుఁ దొలఁగఁజేయు-భద్ర. ౮౦

చిలుకకు మాటలు చెప్ప రామాయని చేసితు మోక్షంబు చెందలేదె
వరుస దాఖలుదోఁచి వాల్మీకియు మరమరాయని మీకృపఁ బ్రబలలేదె
పతిశాపగతినుండి పాదరేణుప్రసోఁకి పాషాణమింతియై పరఁగలేదె

* * * * * * *

పృథివి శరణాగతత్రాణబిరుదు నీదె
కాక యితరుల కెందైనఁ గలుగఁ గలదె-భద్ర. ౮౧

కంటెనేమో నాదుకఠినచిత్తమునందు నిలిపిన నీపదనీరజములు
అంటెనేమో నాదునఘలేశ మాత్మకో సంచరింపఁగ మేనఁ జమటలూరి

సోఁకెనేమో నాదుచెవులకులోఁజూపులు చూచుచుండఁగ ముఖసుందరంబు

*　　*　　*　　*　　*　　*　　*

సామి యిఁక నేరములు నీరసంబు చేసి
కాచి రక్షించు నన్నాగ్రహ కడలుకొనఁగ-భద్ర. ౮౨

గొల్లలాడితినని కోపింపఁ బోకుఁడీ యవని మీదివ్యనామామృతంబు
పీఁటి బుచ్చితినని వింతగాఁగనకుఁడీ కృతులందు మీగుణకీర్తనములు
కాడుచేసితినని కంటకపడకుఁడీ మీకటి మీదివ్యకథారసంబు
ఎఱుఁగఁబల్కితినని యెగ్గుగాఁ గనకుఁడీ మహినిమీనుస్వకర్ణంబులెల్లఁ
బంచి పెట్టితి నని కోప గించవద్దు
సరస మీపద్యముల్ చెప్ప నంతతంబు-భద్ర. ౮౩

వేయికన్నులుగల్గు వేల్పుకేనిక్కైనఁ గనుఁగొనరాని శృంగారరూప
వేయినోరులుగల్గు పాములకంటికైన వచింపరాని యనంతనామ
వేయిచేతులుగల్గు వేఁడివేల్పునకైనఁ (బోల్ప) రానట్టి పుణ్యమూర్తి
వేయిరీతులుగల్గు వేదంబులైనను బ్రస్తుతిసేయనేర్పడనిచరిత*
తగుదు నని నాదు మూఢచిత్తమున నిన్ను
నిల్ప శక్యంబె నావంటి యల్పునకును-భద్ర. ౮౪

పనిపట్టితేనొక్క పవనసుఁడు చనుదెంచి యరిబలంబులను జక్కాడలేదె
సెలవిచ్చితే నొక్కబలిమిని నీలుఁడు నని విరోధులఁ దెగటార్పలేదె
యానతిచ్చిన నొక్కయంగదుఁ డనుకేఁగి పగతురయసువులు పాపలేదె

*　　*　　*　　*　　*　　*　　*

స్వామి సాత్త్వికరూప విచక్షవతుల
†నోచ్చితిరిగాన తురకల యెదుటదొంత-భద్ర. ౮౫

నలనీలకుముదసేనానాయకోత్తముల్ బలసి ముంగల బరాబరులు సేయ
హనుమదు జాంబవదంగదాదులు నిల్చి యంచలంచలను జోహారులిడఁగ
వరుస సుగ్రీవగవయగవాక్షకులు నొరసి మిన్నంటి చామరలువీవఁ
బరమభాగవతఖేచరసిద్ధచారణుల్ జయజయశబ్ద..ములు నుడువ
సురలు విరులు గురియఁ బోలవరమునుండి
భద్రగిరి కేగు వేడ్కను బ్రస్తుతింప-భద్ర. ౮౬

---

* వాగ్లవచరణము—నిప్పునతికి ఱరాని ప్రాజసువులనుశకైనను నెప్పడనిచరిత్ర- అని.

† మోచ్చితిరిగాక తుర్కలమొకటికెల్ల-మూ

అంగ వంగ కళింగ బంగాళ నేపాళరాజుల కెల్ల శ్రీరాములాజ్ఞ
గూర్జరకర్ణాట కురుకొంకణచోళరాజుల కెల్ల శ్రీరాములాజ్ఞ
చోటసింధుమరాటలాటమత్స్యవిదర్భరాజుల కెల్ల శ్రీరాములాజ్ఞ
పాంచాల సౌరాష్ట్ర బర్బరమగధాంధ్రరాజుల కెల్ల శ్రీరాములాజ్ఞ
దివ్య తిరునాళ్లకు సమస్తదేశవరులు
రావలయు నంచుఁ జాటింపఁగా వలయును. భద్ర. ౮౭

శ్రీరామచంద్రులు సీతాసమేతులై వచ్చిరి భద్రాద్రివాసమునకు
జయనామవత్సర చైత్రశుద్ధాష్టమి తరవాతిదినమందుఁ దగవివాహ
మరయమార్గమునందు నెరయసత్రములు బల్చలువపందిరులు వెచ్చని జలములు
శీతోదకంబులు చిక్కని మజ్జిగల్ పుష్పపండ్లరసంబు నీరుచల్ల
లాదిగాఁగల్గు ద్రవ్యంబు లమరఁజేయ
వలయునని వేగఁబంపుఁడీ వాయుసుతుని, భద్ర. ౮౮

తిరిగి రాముఁడు భద్రగిరికేగువార్త లాలించెనా వజ్రిత్రాళీలోసంగు
నవనిజాధిపుఁడు భద్రాద్రిఁ జేరుట వినఁగలైనా జముఁడు చౌకల్లోసంగు
దశరథాత్మజులు స్వస్థానంబు కరుగుట వినియెనా వరుణుండు మణులొసంగు
భరతాగ్రజులు నిజపురము కేతెంచుట లెఱిఁగెనా ధనదుఁడు నేర్పుఁ బోసఁగు
ననుచు నలనీలజాంబవదాంగదాదు
లమరి యున్నారు శుభవార్తలరసి చెప్ప, భద్ర. ౮౯

కలిమిచే విబుధులఁ గాననేరనివారి వారించు గుణశాలి వదినెగారు
నెఱిఁ జేదనైనను నిల్చి చేపట్టియు ధీరునిఁ జేయుపత్నీలలామ
పతితాత్ము నైనను బావనుగాఁజేయు గుణవతి ముద్దులకూఁతు రరయ
నవివేకు నైన విద్యావంతునిగఁ జేసి గురురూప మొనరించు కోడలెన్న
నిట్టిసంపత్తి గల మిమ్ము నెఱిఁగి భక్తిఁ
గొలిచితిని వేగ నాకేమి కొదవయింక, భద్ర. ౯౦

దయశాలితల్లి యుదారసాహసుఁ డప్ప భూభారకుఁడు శయ్య పుష్పబాణుఁ
డరయఁ బుత్రుఁడు శీతకరుఁడు మఱంది వాసవసూను డిష్టుఁ డైశ్వర్య యుతుఁడు
నెచ్చెలి దేవమౌని దలంపు మనుమఁడు రత్నాకరంబిలు రమణ నెన్న
రిణపూరుఁ డన్న సారసనేత్రి పర్ణింప నవతారమూర్తి వీవవనిలోన
నిట్టి మిముఁగొల్చునామది కిటిబుద్ధు
లమరనర్చునె యొన్నిజన్మములనైన, భద్ర. ౯౧

వరుస విద్యలు చెప్ప వదిన సరస్వతి యాయ వృసయసేయ నన్నయజుఁడు
ముదమిాయ నక్షత్రములు మేనయత్తలు మాకిష్టమిసఁ జందమామమామ
యరసి పాపములఁ బాఁప నక్క దివిజగంగ యైశ్వర్యమొసఁగ శ్రీహరుఁడు బావ
మాతల్లియుల్లోకమాత కల్మషదీనపోషకుఁడవు తండ్రి పొసఁగ నీవు
ఇన్నియును నింట గలుగుట యెఱిఁగి యితర
దైవములవేఁడవాకేల దైవరాయ, భద్ర. ౯౨

బలుసాకువ్రక్కి ద్రౌపదిచేత వనమునఁ బాండవావలిని గాపాడినట్లు
సరవిఁదెచ్చినకుక్ష సారంబనుభవించి చెంచుమాద్రియును రక్షించినట్లు
అడిగి తెచ్చిన ముక్కుబుకులు భక్షించి చెలఁగి బాఁపని ధన్యుఁ జేసినట్లు
పెట్టఁగానని తొంటికొట్టుకు బలిమాలి మునలియవ్వకుఁ గీర్తి యొసఁగినట్లు
పూనపాటినృపాలురఁ బ్రోవఁదలఁచి
తెచ్చుకొంటివొ మాకుచ్చు వెచ్చములకు, భద్ర. ౯౩

గోత్రికు లని వారు కొట్టిపోలేక మాయంశభూతులటంచు నడిగినావో
పేరుమోసినకట్న మారసికొంటివో ప్రభులనుచు నంతఁ జేసినావో
మానాఖరులలోన మాకీర్తి మెచ్చుకుఁ దెచ్చె నని చూపివ్వయమున కలిగినావో
స్థలము వంశంబు మా రోసిపోలికఁ బలుకష్టసుఖంబులఁ దెలిపినావో
యెట్టిదయ చేసిరయ్యా మీకట్టిమాకుఁ
బూనపాటికులోద్భవ బాసమెఱిఁగి, భద్ర. ౯౪

రవికులోత్తమ దశరథరాజనందన తాటకామదవిమర్దన మునీంద్ర
మఖపరిపాలన, మారీచహర, యహల్యాశాపమోచన, హరశరాస
నవిభంగ జానకీనాయక భార్గవరామ గర్వాపహార సుగుణాఢ్య
పితృవాక్యపాల విపినశైలసంచారక కురంగభంగక కపిపపాల
వాలిమదభేద వారిధిబంధన......
దశముఖకులవనదావ త్రిదశవంద్య, (?) భద్ర. ౯౫

సద్ధర్మచారిత్ర..........శ్రీధరపుణ్యగాత్ర సీతాకళత్ర
కరుణాలవాల శ్రీకరభక్తపాల సన్నుతమౌనిజాల యంచితసుశీల
పరమపవిత్ర శేషబాణనైరిమిత్ర వాసరమాన్యగోత్ర విశాలనేత్ర
రఘుకులాధీశ నిర్దళితశంకరచాప సుందరరూప నిశ్శత్రుప్రతాప
రణజయాలాప దైత్యమర్దనకలాప
మానిమానససారసమత్తమధుప, భద్ర. ౯౬

రణభీమ దైత్యమారణహోమ పుణ్యకారణనామ వినుతచారణలలామ
వనచార కలితపావనశూర మౌనిభావనపూర వీరరావణకఠోర
జనరక్ష కృతపుణ్యజనశిక్ష వరభక్తజనపక్ష సత్ప్రియోజననిరీక్ష
జితదోష మౌనిపూజితశేషశయన వారధిశోష పార్థసారథ్యవేష
సరసగుణధామ రవికులసార్వభౌమ
దశరథసుపుత్ర దేవ సీతాకళత్ర, భద్ర. ౯౭

వరరూపలావణ్య వైభవార్తశరణ్య దేవాగ్రగణ్య పార్థివవరేణ్య
ఘనసీరదనిభాంగ ఖగనాయకతురంగ విజితహేమకురంగ వృజినభంగ
మౌనిమానసభృంగ మథితఘోరభుజంగ పరిపాలితప్లవంగ ప్రణుతగంగ
భక్తవనజమిత్ర పావనచారిత్ర శతముఖస్తోత్ర కౌసల్యపుత్ర
ధర్మగుణసాంద్ర రఘుకులతారకేంద్ర
సవనసంరక్ష యాత్రికజనసుపక్ష, భద్ర. ౯౮

జలజాక్ష ఘనరాక్షసవిశిక్ష మునిపక్ష రణశూర వనచార రఘుకుమార
యఃరిశోష మునివేష సురపోష మృదుభాష రఘుపుంగవ భుజంగరాజభంగ
శరచాపధర పాపహర భూపకులదీప రతిరాజజయతేజ హితసమాజ
మురభీమ సురసోమ వరనామ గిరిధామ సురపుంగవశుభాంగ సుప్రసంగ
భక్తపరిపాల గుణజాల భవ్యలీల
దివ్యమంగళవిగ్రహా దీనరక్ష, భద్ర. ౯౯

శరణు త్రిలోకరక్షణ మౌనిసన్నుత శరణు సద్భక్తరంజనచరిత్ర
శరణు విశ్వామిత్ర సవనసంరక్షణ శరణు గౌతమపత్నిశాపహరణ
శరణు మారీచభంజన వార్ధిబంధన శరణు ప్లవంగపోషణముకుంద
శరణు వైకుంఠవాస విశాలలోచన శరణు ఇక్ష్వాకువంశజ మహాత్మ
శరణు వాసవనుత శేషశయన శరణు
శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గహస్త, భద్ర. ౧౦౦

రామదాసాదుల రక్షించినట్టులు నెలమితోడఁ గుచేలు నేలినట్లు
ప్రహ్లాద నారద ప్రభృతిఁ బ్రోచినయట్లు సరవితో ముచికుందు సాఁకినట్లు
అలద్రౌపదికి వల్వలాదుకొన్నట్టులు గజరాజు నవవిలోఁ గాచినట్లు
శబరివిందుకు సంతసమ్ము నొందినయట్లు మహిఁ ఘంటాకర్ణు మనిచినట్లు

నన్ను దయనేలు నేరము లెన్న కవని
మూఢచిత్తుఁడ నవివేకములు హరించి, భద్ర. ౧౦౧

సర్వధా రనుపేరిసంవత్సరమునను ధంసాకు వెఱచి యిద్దఱకి వచ్చి
పోలవరంబులోఁ బొలుపొంద నైదేఁడ్లు వనవాస మొనరించి వరుసతోడ
శాక్తేయమతయుతు సంహార మొనరించి మంత్రాంగశక్తి యిమ్మహిని వెలయఁ
దగఁ బూసపాటి సీతారామరాజు విజయరామరాజుల సరసముగను
విజయసంవత్సరంబున విజయముగను
భద్రగిరికేగి తౌనయ్యభద్రముగను, భద్ర. ౧౦౨

మొదలఁ గావ్యము లేశమును బఠింపఁగలేదు శబ్దజాలముల వాసనయెఱుంగ
ధరవిభక్తిజ్ఞానసరణి యేమియు లేదు లక్షణశక్తి చాలదు తలంప
గ్రంథశోధకుఁడను గాను వ్యాకరణసూత్రము లవలేశమాత్రము నెఱుంగ
నవని నీదివ్యనామామృతాసక్తిచేఁ బూనితి నీకావ్యబూటకంబు
మున్ను నన్ను మరామరాయన్నఘనుని
వగిది దయఁ జూడవలయు నావదలు ద్రోలి, భద్ర. ౧౧౩

సదులు మున్నీటికై యదనిచ్చి పాఱుచో నదురేగు మీనము లుద్దులుఁగూడి
వనవసంతాగమదినములఁ గోయిలల్ మొగమిచ్చి వల్కును వగలు గులుక
సరవి మేఘోత్పత్తిసమయంబున నెమిళ్ళు పురివిచ్చియాడు నంబరముగాంచి
సిరిగల్గువేళలఁ బరమదయాళులై పురిబంధుజనములు పూజచేతు
రితరకాలంబులను వార లెగ్గుసేతు
రేమి వివరింతు మాయల సామినేఁడు, భద్ర. ౧౦౪

రమణతోఁడుత నిభరాహిముఖానుని నేల పుట్టించెనో యిలను బ్రహ్మ
పుట్టించెఁ గాక యీపుడమిలోపల నేల ఫాజిలుబేగని వల్లఁజేసెఁ
బల్లఁజేసినవాఁడు కదవిచాలయొసంగి లీల జాల్బుంగు పేరేల తెచ్చెఁ
దెచ్చినవాఁ డేల దృఢచిత్తుఁగాఁజేసె ధంసా యను కితాబు ధరణి నొసఁగ
నొసఁగి మిముగెల్వ సాహస మొనర నేల
చేసెనో యని మదిఁ జింతసేయవలదు, భద్ర. ౧౦౫

రమణఁ గౌండిన్యగోత్రపవిత్రుఁడను లింగసకుఁ బౌత్రుఁడను పెద్దనకును బుత్ర
వరుఁడఁ బేరయనామధరుఁడ భల్లావంశ వార్ధిసోముఁడ బుధవర్గ మలర

వలన వేఁచేసిన వచన యాస్పదముగా మదిలోన భావించి ముదమెలర్ప
ఘనత వ్యాజస్తుతిగా నొనర్చితి నీనశతక మష్టోత్తరశతము గాఁగఁ
జిత్తగింపుము హంసంబు క్షీరములను
గ్రాహ్యమొనరించుచందంబు గడలుకొనఁగ, భద్ర. ౧౦౬

కేశవ మాధవ కృష్ణ హృషీకేశ నారాయణ ముకుంద నారదనుత
వర్ధనా భాచ్యుత ప్రద్యుమ్న శ్రీధర వామన గోవింద వాసుదేవ
విష్ణోనిరుద్ధ త్రివిక్రమా ధోక్షజ నారసింహ జనార్దన మధుసూద
న యుపేంద్ర సంకర్షణ పురుషోత్తమ హరే దామోదరానంత దానవాంత
యఖిల లోకైకనాథ దివ్యాంఘ్రిపద్మ
ములకుఁ బ్రణమిల్లెదను ముదములరనేలు
భద్రగిరివాస శ్రీరామభద్ర దాస
పోషబిరుదాంక రఘుకులాంబుధిశశాంక. ౧౦౭

జయ రఘుకులదీప జయ దశరథపుత్ర జయ భరతాగ్రజ జయ ముకుంద
జయతాటకాంతక జయమఖపరిపాల జయయహల్యాపోష జయయుపేంద్ర
జయ హరధనుఃఖండ జయజానకీనాథ జయ భృగుసుతభంగ జయకృపాబ్ధి
జయ వనసంచార జయ వాలిమర్దన జయ వార్ధిబంధన జయ మురారి
రావణాంతక సాకేతరమణ నీదు
వలన శతకము వినువారి వలన లుసుగు
భద్రగిరివాస శ్రీరామ భద్ర దాస
పోషబిరుదాంక రఘుకులాంబుధిశశాంక. ౧౦౮

శ్రీ

# వరదరాజశతకము.

—। కృష్ణకవిప్రణీతము ।—

రేఫప్రాసయుతచంపకమాలావృత్తములు.

---

సురనుత మంజుభాష వరసుందరవేష స్వభక్తపోష యా
సురమదశోష సర్వగుణశోభితభూష కృపావిశేష నే
శరణని వేఁడిన న్వినవు సాహసమా చలమా యిదేమి మం
దరధర కుందసుందరరదా వరదా మురదానవాంతకా. ౧

హరిహయుఁ డాదియౌ సురల కండనివాని విరించి మౌనులు
న్మొరలిడువాని దాసజనముఖ్యులు గొల్చెడువాని దీనులన్
సరగునఁ బ్రోచువాని నిను సన్నుతిసేతును నన్నుఁ బ్రోవు మం
దరధర కుందసుందరరదా వరదా మురదానవాంతకా. ౨

స్ఫురదరవిందనేత్ర యతిశోభనగాత్ర గిరీశమిత్ర సా
గరతనయాకళత్ర వరగర్వమదాసురజైత్ర భారతీ
వరనుతవక్త్ర యోగిజనవందితపాత్ర సువర్ణవస్త్ర మం
దరధర కుందసుందరరదా వరదా మురదానవాంతకా. ౩

గరుడతురంగ శత్రుజనగర్వవిభంగ రమాంతరంగ నే
మొరలనిడంగ నీ కదియు ముద్దా భుజంగశయాన నీకు నేఁ
బరుఁడనె మానిసంగ రిపుపక్షమతంగజ దోషహారి మం. ౪

వరసఖ దైత్యమర్దన నారదసన్నుత యప్రమేయ శ్రీ
ధర కరుణాపయోనిధి సుదర్శనసాయక వాసుదేవ సా
దరమతి నన్నుఁ బ్రోవఁగదె తాపసహృత్కమలాంతవాస మం. ౫

కరకరిఁ జూడ మేర యదిగాదు దయాపర నీదునామ మే
నిరతము సంస్మరించెదను నిర్మలుఁ డం చని ప్రోవకుండినన్
వరదుఁడ నన్నమాట కదివైరగునే తగునే రమేశ మం. ౬

సరసిజనాభ వామన ప్రసన్న నిను స్మరణంబు వేఁడినం
బరమకృపాకటాక్షమునఁ బారఁగఁజూడ వదేమిచోద్యమో
హాఁహరి నీదుమానసము హా శిల యౌట యెఱుంగనైతి మం. ౭

కరముల నొగ్గి వేఁడి పదకంజములే మది నమ్మియుండి యీ
చరితము లాలకించుచును శౌరి యటంచని పాటపాడుచున్
స్థిరమతిఁ గొల్చియున్న మదిచింతలు వావ వదేసె బాసు మం. ౮
సరిసరి చాలురా యిటులు సాహసమేలర నమ్మినానురా
విరసము మానరా యిఁకను వేఱుగ నెంచక ప్రోవవేమిరా
సురనుత రార నామనవి సొంపుగ నింపుగ నాలకింపు మం. ౯
చిరమతినై భజింప నను జిక్కులఁ బెట్టియు స్రుక్కఁ జేసితన్
స్థిరమతి నెవ్వరయ్య యిఁకఁ జేరిచి ప్రోచెడు వార లక్కటా
దొర వని నిన్న నమ్మితిని దోసిలియొగ్గితి నేలుకొమ్ము మం. ౧౦
వరగుణసాంద్ర యోగిజనవందిత భోగసురేంద్ర నీపదాం
బురుహయుగంబు నమ్మినను బ్రోవక వంచన నెంచఁబోకు శ్రీ
హరిహరి నీకిదే యిడెద నంజలి చేకొను మేరుధీర మం. ౧౧
గురుఁడవు తల్లి దండ్రి పతి కూరిమిబంధువు దేవుఁ డంచు నే
నిరతము నమ్మియున్న నిఁక నీ విటు సేయుట పాడియౌనె యో
వరద పరాత్పరా దురితవార్ధి మునుంగకయుండఁ బ్రోవు మం. ౧౨
పరసతులన్ హరించితిని బాత్రమెఱుంగక నిక్కి త్రుళ్లితిం
బరధనము న్వెసం గొనితి బ్రాహ్మణముఖ్యుల నిందచేసితిం
బరహిత మెంచలేని బహుపాపిని నెట్టులనైనఁ బ్రోవు మం. ౧౩
మురుగులు గొలుసులుం బతకము న్గలత్రాడును నుంగరంబులు
న్సరిపెణలుం గిరీటములు సాలువులుత్తరజన్నిదంబులు
న్నరుభుజకీర్తులే నడుగ నొక్కటి నీపదభక్తి నిమ్ము మం. ౧౪
హరులను గోరలేదు బిరుదావళు లిమ్మని వేఁడలేదు నే
నరదము లిమ్మటంచు నిను నష్టముగా నరికట్టలేదు నా
మొర విని ప్రోవుమంటి నిఁక మోసము చేయకుమీ యటంటి మం. ౧౫
మరణము నొందు నాసమయ మందునఁ గాలుని కింకరాళినా
నరసను నిల్వ రోగములు చాలఁ బెనంగఁ గఫ బుగట్ట నే
స్మరణ యొనర్తునో పలుకఁజాలనో యిప్పుడె చేతు బ్రోవు మం. ౧౬
శిరము సుదర్శనాయుధుఁడుఁ జిందము నేరు గళంబు నచ్యుతుం
డురము గదాధరుండు భుజయుగ్మము నాహరి నాభిఁ బంకజో
దరుఁడును బాదయుగ్మము ముదంబున శ్రీధరుఁ బ్రోవఁ జేయు మం. ౧౭

పురములు సంచరించునెడ భూములు గ్రుమ్మరువేళ గ్రామముల్
దిరిగెడువేళఁ బల్లెలను దీవ్రముగాఁ జనువేళ రోగముల్
గురుకాననంబు పిశాచగణక్రూరమృగాదులఁ జేరనీకు మం. ౧౮
దురితవిదూరుఁ డంచు మది దుఃఖములెల్లను ద్రుంతువంచు న
న్గరుణను బ్రోతువంచు నిఁకఁ గష్టముఁబెట్ట వటంచు నమ్మితి
న్నిరతము దాసుఁడైనపుడు నీకృపనుంచు బిరానఁ బ్రోవు మం. ౧౯
హారుఁ డమరారికి న్వరము నర్థినివేఁడ నొసంగి హస్తముల్
శిరమున నుంచిచూతునన శీఘ్రమె వచ్చెడి దొండకాయనోఁ
జోరఁబడ దానవుం దునిమి శూలినిగాచిన రీతిఁబ్రోవు మం ౨౦
సరసిజగర్భుకై సకలసంపద లెల్లను మాని యంచయై
సరగున సృష్టికారణము సాహస మేర్పడ బోధసేయు నీ
చరితము లెన్నఁగాఁ దరమె శౌరి మురారి హరీయఘారి మం. ౨౧
పరమదయాకరుండవఁట భక్తజనావళిఁ బ్రోతువంట నీ
కరుణకు లోకము న్మనలఁ గాచుకయుండెదరంట వేదము
ల్వరుస నుతించునంట యిటువంటి మహాత్ముని జేరికొల్తు మం. ౨౨
మొర వినలేవొ నీచెవులు మూసుకయుంటివొ లేక నిద్రవో
కరుణఁ దలంపవో దురితకర్ముఁడు వీఁడని యెంచుకొంటివో
మఱపున నుంటివో తనకుమర్మముగంటివొ సాధ్యమౌర మం. ౨౩
సరగున రావదే నను ససంభ్రమమొప్పఁగఁ జూడవేమదే
నిరతము వాదె నాపయిని నేర మదే జగదేకవీర దే
వరకును దానుఁ డంటి గదె వైరమదే మదిరాదె ప్రోవ మం. ౨౪
దొరతనమా నమామి యని దోసిలి యొగ్గియు నిన్ను వేఁడిన
గరువతనమ్ము ప్రోవఁ దతి గాదని యుండుటిదేమి క్రోధమా
బిఱబిఱనమ్ము నాయెడల భేదము కౌస్తుభధామ రామ మం.
పరుఁడను గానురా యిఁక నెపం బిడఁగ న్నను గావవేమిరా
విరసము మానరా యిటులు వేడుక చూచుట పాడిగాదురా
సరసత నేలుకోర యిదె సాఁగిలి మ్రొక్కెదరా సుధీర మం. ౨౬
మరుజనకా పరాక యిఁక మన్ననఁ జూడక రాక వేడుకా
విరసముకా నరేకదర వేఁచుటకా ననుఁబ్రోవకుంటిగా
మఱచుటకా నిరంతరము మర్మము చూచుటకా చిరాక మం. ౨౭

త్వర నిటు రమ్ము నామనవి తత్క్షణమే కృపఁ గొమ్ము వింతగా
దురితము లెల్లఁ జిమ్ము నను దుష్టుఁడటంచనఁబోకుసుమ్ము నే
నరులను వేఁడ నమ్ము నిను నాసకలంబనియుందు లెమ్ము మం. ౨౮

శరణని యుంటి నెల్లపుడుఁ జక్కని భక్తిని వేఁడుచుంటి నీ
కరుణకుఁ బాత్రుఁడంటి నిఁక గాసిని బెట్టకు మంటి విన్నవే
మఱిమఱిఁ బాడుచుంటి ననుమానము మానుమటంటిఁ బ్రోవు మం. ౨౯

పరుగున రా వదేమి నను బాధలఁ బెట్టెదవేమి పిల్వఁగా
మొఱ విన వేమి ప్రోవకను మౌనము చేసెదవేమి శౌరి నా
సరనకు రా వదేమి నెఱసాహస మేమిర ప్రోవవేమి మం. ౩౦

గరుడునిపై వసించి వరకౌస్తుభహారముఁ దాల్చి గట్టిబం
గరువలువన్ ధరించి సొబగైనకిరీటము నుంచి చక్రముం
దరము నమర్చి దాసుని ముదంబునఁ బ్రోవఁగవచ్చి నిల్వు మం. ౩౧

త్వర ననుఁ బ్రోవకుండినను దార్క్ష్యుని యాన ఫణీంద్రు నాన నీ
వరమపదంబు నాన సిరిపంట వెలందుల యాన యింక నీ
చరణములాన ద్వారకుల జంటలయాన నిజంబు నమ్ము మం. ౩౨

కరుణను జూడరా బిరుదు గట్టితి వల్లది కల్లగాదురా
యరమర మానరా కలుషహారివి నాదురితంబు మాన్పరా
నిరతము నమ్మినార నను నేరము లెన్నకురా సుధీర మం. ౩౩

మఱవకు నన్ను సద్గుణుఁడ మ్మ్రసి ద్రోహిని నీచకృత్యుఁడం
బరధనదారలం గొనెడు పాపిని గోపిని నీపదాబ్జమే
యిర వని నమ్మినాఁడ మది నిష్టముచేసుక ప్రోవుమయ్య మం. ౩౪

వరమునిగేయ సర్వసురవందితకాయ సునామధేయ నీ
వరమరసేయు నెవ్వరిఁక హా నను జేరఁగఁ దీయరయ్య నా
మొఱ వినదాయెనా యిటులు మౌనము చేయకు భాగధేయ మం. ౩౫

హరునిఁ గృతార్థుఁ జేసితివి యబ్జజునిం ఘనుఁ జేసితౌర యా
హరిహాయు కోర్కెఁ దీర్చితివి యందఱికన్నను నన్ను నొక్క క
న్నరసియుఁ బ్రోవవయ్య బిరుదప్పను చెల్లును దేవరాయ మం. ౩౬

*గురుతర మీనమై జలధి గొబ్బునఁ జొచ్చియు సోమకాసురుం

---

* ఇక్కడనుండి దశావతారవర్ణనము.

బరువడి వ్రచ్చి వేదము లపారకృపామతిఁ దెచ్చి ధాతకుఁ
సురలునుతింప నిచ్చిన యశోనిధి నిన్ను నుతింపనేర మం. ౩౭
సుర లసురుల్ మహానగము సొంపుగఁ దెచ్చి సుధాబ్ధినుంచి వే
సరకను ద్రచ్చుచుండ నది సంద్రము నందు మునుంగఁ గూర్మమై
నరగున నద్రి వీఁపున వెసన్ ధరియించి సురాళిఁ బ్రోచు మం ౩౮
వరబలమత్తత న్విబుధవర్గము భీతిలుచుండఁ గ్రూరుఁడై
ధరణిని మ్రుచ్చిలించుకొని ధైర్యముతోఁ జను హేమనేత్రునిం
ద్వరను వరాహరూపమున దైత్యుని ద్రుంచి విధాతఁ బ్రోచు మం. ౩౯
కరుణ యొకింత లేక సుతుఁ గాసిలఁ జేయుచు నున్న దానవుం
ధరనిఁక నుంచరా దని ముదంబునఁ గంబము నందు శ్రీనృకే
సరివయి పుట్టి రక్కసునిఁ జంపియు బాలుని గాచినట్టిమం. ౪౦
సురపతి రాజ్యసంపదలఁ జూఱగఁ గొన్న బలీంద్రుచెంతకు
న్నరగున నేగి వామనుని చందము తోడఁ బదత్రయంబు వే
సరకను వేఁడి కైకొని రసాతలమందున వానిఁ ద్రొక్కు మం. ౪౧
పరశుధరించి సర్వజనపాలుర నెల్లను భీకరంబుగా
నిరువదియొక్కమాఱు వధియించి పితాళ్లకుఁ బ్రీతిసేయు నీ
వరబలమెంతు నే భువనవందిత భార్గవవంశరామ మం. ౪౨
ఖరకరవంశజాతుఁ డయి కౌశికుయాగము గాచహల్య శా
పరహితఁ జేసి రుద్రువిలు భగ్నమొనర్చియు సీతనేలి యా
సురులను రావణుం దునిమి సొంపుగరాజ్యము నేలురామ మం. ౪౩
కరకమలంబునన్ హలముఁ గ్రక్కునఁ బూనియు దానవావలిం
బొరిగొని హస్తినాపురము బోర్లఁబడంగను బెల్లగించు నీ
వరబల మెన్నవాతరమె వారిజనేత్ర ప్రలంబహంత మం. ౪౪
సరసిజనాభ యోగిజనసన్నుత యాదవవంశమందు నీ
వరమరలేకపుట్టి స్వకులాంగనల న్రమియించి దుష్టులం
బొరిగొని కంసుఁ దునిమి పుణ్యులఁ బ్రోచిన ముద్దుకృష్ణ మం. ౪౫
సరగునఁ బూతనంగెడపి చక్రముఁ దన్ని తృణాసురు న్వడిం
బొరిగొని ధేనుకాసురుని పొంక మడంచి ప్రలంబుఁ డాదియౌ
సురులవధించి గోపకుఁ సుందరుల న్రమియించినట్టి మం. ౪౬

ము చెలువున నున్న ద్రప్రాణికం బైయత్యద్భుతం బగు నొక్క కాళిందీతీరకాంతా
రంబు ప్రవేశించి. ౧౭

—శ్రీకృష్ణుఁడు వేఁట సలుపుట—

క. నలుదెసలఁ గాపు లునిచెన్, బలియుల మృగయులను వీరబలశాసనుఁ డా
జలజాతపత్త్రనయనుఁడు, బలశాసనతనయుఁ బనిచి పటువేగమునన్. ౧౮

గీ. అతులచాతుర్య మొదవంగ నమ్మహాత్ముఁ
డమర ఘటియించె నపుడు పూర్వాదులందు
సంభవత్తత్త్వమయసంజ్ఞ*నరగఁ జేసి
సకలవిబుధులు వినుతింప సద్వ్య(వ)స్థ. ౧౯

క. దిక్కుల గ్రమ్మి ధటుల్ రోదఃకుక్ష్యమ్మసిఁ జేయు మృగము లురవడి బెగడన్
మిక్కుటపుసూక్ష్మవాక్కులఁ, బెక్కండ్రనీతకవులు బెదరెడుమాడ్కిన్. ౨౦

క. జలజాక్షునుచెఁడి తమ్ములు, బలుమృగముల వెదకి వెదకి పడఁజేసిరి దో
ర్బల మలర శాబ్దికోత్తము, లలయపశబ్దముల నెమకి హరియించు క్రియన్.

గీ. అలసనత్త్వంబులనసత్త్వములఁ గ్రియా †ప
రాశయముల స్వరాదుల నవ్యయములఁ
దా నిపాతంబులుగఁ జేసి ధరఁ దదంత
సంగ్రహాయత్తమతి దైనసాధుమౌళి. ౨౨

గీ. మాన్యుఁడై నట్టి యాధ్వనిమార్గవేది, లక్ష్యమూలంపుధ్వని నవలంబనంబు
చేసి హరియించె మిక్కిలి వాసిగాంచు, తనకృతిత్వము మర్మవేత్తలునుతింప.

క. కరము రుచు కృష్ణమేఘం, బురుతరశరవర్షవైభవోదగ్రముగా
ఖరవైశ్వానరకీలలు, విరళితలే కన్నియెడల వేకననయ్యెన్. ౨౪

గీ. అవ్యయప్రకాశ మ‡విభక్తికోజ్జ్వలం, బగళితోరుసత్త్వ మంతకార్య
కరము నాచు మెలఁగె సురుచిరతద్ధిత, కృద్గణంబు దహనకీలితంబు. ౨౫

వ. ఇటు మృగయావిహారంబు కొంతప్రొద్దు గడపి చాలించి యమ్మహామాయ
లాఁడు రాజార్హంబు లగు నామిషంబులతోఁ బరివారంబు హరిప్రస్థంబున
కుఁ బోవఁ బంచి విశ్రాంతివ్యాజంబున నర్జునానుచరుం డై కమలాసనవర
మహాంసనీలకంఠసంసేవితం బై శుకముఖసుకవికరనముకభోగయోగ్యం బై
తనుభవక్లాంతినస్వాపహరణప్రవణం బై శరద్రాకాశశాంకాకలంకచ్ఛా

*లలరఁజేసి-మూ. †పరాశ్రయములు-మూ. ‡విభక్తికోజ్జ్వలం-మూ.

యాచోరప్రభాభరంబై తెలిదీవిపైఖరిం బరిహసించు నొక్క కాళిందీనదీ
సుందరపులినతలంబున విశ్రమించి. ౨౬

క. కనియెం బద్మదళాక్షుఁడు, కననివినసమేలుపుమముఁగల ప్రియురాలిం
గనికనఁగరాని చంచలఁ, దనులత యచలంపుఁగోచిఁ దల మనుదానిన్ ౨౭

—శ్రీకృష్ణుండు కాళిందిని జూచుట—

క. ఉపమానభావమును దన, కపకారముగాఁగఁ దలఁచు నఘన మగుచుం
దపముఁ బలు *కాఁకఁ దనకై, తపియింపుచునుండునట్టి తపనతనూజన్.

క. కనికని నిరతిశయానం, దనిధిత్వ(ము) గాంచి యేని కమలదళాక్షుం
డెనలేనిముదముఁ గొనుచున్, మనమునఁ గాళిందిరూపమహిమము పొగడున్.

గీ. ఏతదఘనసంగతి నెట్టిముదము, †విమయివర్గంబుఁ గైకొని వెఁసె దానిఁ
గాంచుఁబున రేతదంగసంఘటనగలుగ, భాగ్యమెన్నఁటికబ్బునప్పటికిమగుడ.

చ. సరసిరుహాసనంబుఁ గొని సన్ముఖసీమ గృహీతవాచమైఁ
బరఁగఁగ శ్రోత్రియత్వమునఁ బాటిలి పూర్ణతపంబుసేయఁగా
సరసిజగర్భ! యీయువిదచక్రఁదనం బొనగూర్చునేర్పు నీ
కరుదు ఘటిల్లెఁ గా కరయ నల్పతపంబున నిట్టి దబ్బునే. ౩౦

ఉ. సారసగంధిమధ్యమము సంఘటియింపఁగ యోగ్యవస్తుసం
భారము లేమినో యిది యభావముచేసితె పద్మజాత నీ
నేరుపు నెట్టు లెన్నఁ గొన నేరఁగ నయ్యెద దానిమీఁదటం
జేరి వసింపఁజేసితివి సిబ్బెపుగుబ్బలు గొప్ప‡కుమ్ముడిన్. ౩౨

గీ. ప్రస్ఫురద్వ్యక్తిసంబంధబలముకలిమి, నుల్లసించె నలంకృతు లెల్లఁ గాన
లలనయుత్తమకావ్యంపులక్ష్మి యనుచు, నవనిరసికులు గొనియాడుట రుదుగాదు.

గీ. అమథనావిలసింధుమధ్యప్రభూత, పద్మవాసిని యాశరత్పద్మనయన
వ్యక్తిసుందర§తాన్యకృతాఖిలోరు, భూషణత ముఖ్యకృతిలక్ష్మిఁ బోలునింతి.

సీ. ఇది మన్మథోన్నత్యహేతు వౌటఁ దలఁప మదికిఁ బులకరించుమరునిదంతి
దంతిగా దిది మృదుత్వంబు చాలఁ జెలంగ మరునిచేతమెలంగు విరులబంతి
బంతిగా దిది కంబుపట్టుగామి మెఱుంగ సోఁగలీనెడు మేలుసోగమెఱపు
మెఱపుగా దిది నిల్కడొఱపుమైఁ దనరారమానసప్రియభావమానునంచ

*కాఁచి-యూ. †కమయ-యూ. ‡కొమ్ముడిన్-యూ. §తాన్యకృతా-

యంచగా దిది ఘనరుచినందికొనఁగ, మధురనాదానువృత్తిచే యాస్యపికము
పికముగా దిది తెలికంటి బెళుకు లెనయు, నతులసౌందర్యదివ్యరత్నాకరంబు.

వ. మఱియుఁ గబరీజలధరమాలికయు నలికచంద్రరేఖయు నిరీక్షణచంచరీకావళియు భ్రూమనోరమయుఁ గపోలశోభావతియు నాసికాకనకమాలయుఁ గర్ణశ్రీకలితయు నధరమధుసుతియు హాసకౌముదియు సుముఖశాలినియుఁ గంధరామత్తకోకిలయు వాగమృతధారయు దంతమౌక్తికమాలయు బాహాకుసుమితలతయు హస్తాంబురుహయుఁ గుచబంధురయుఁ దనుమధ్యాంచితయు రోమాళిభుజంగవిజృంభితయు నాభీవిపులయు జఘనతటమాభిరామయు నూరుదండకమండితయు జంఘాప్రభోపరంజితయుఁ బాదలలితయు నంగలతాచపలయు గుణమణినికరయు నగుచు వృత్తరత్నాకరకృతి నగుచున్న దిక్కొమ్మ మొమ్మో, యేముద్దుగుమ్మ కైన వన్నెగా *నమ్మమ్మ యని మనమ్మున ఘనంబుగాఁ గొనియూఁచుచు నక్కితవయాదవుండు దండనుండు నాఖండలనందను వీక్షించి యిచ్చంచలాక్షీయుదంతం బాద్యంతమ్ముఁ దెలిసి రమ్మా పొమ్మా యని వినోదంబున ముదంబుగాఁ బలికిన. ౩౬

—శ్రీకృష్ణుండు కాళిందికడ కర్జునుని బంపుట—

క. సిరికి నలవడని శోభా, భర మీయింతికి నెసంగుఁ బద్మాక్షునకే
తరుణి యిది గృహిణి గాఁదగు, నరునా శిరమెక్కి యుండుట ల్లఘుల్లన్.

గీ. ఇట్టిసౌందర్య మొనరించునట్టిధాత
కమరు నస్త్రీత్రి యీయింతి హరికిఁ గూర్ప
మిక్కుటంబుగ జగములో మెఱయుఁ గాని
యన్యునకుఁ గూర్ప నయశోబ్ధి నది యడంగు. ౩౭

క. ఈగతి నద్భుతరసనం, యోగిహృదంతరములోన నుదిదఁ బొగడుచున్
†భోగిశతల్పునమపున, నాగుణధుర్యుండు వేగ నరుగుచు నచటన్. ౩౮

సీ. నభయందుఁ బాడితనంస్కృతవాణికైవడి మహాసరసిలోపలను హంసి
వలె నభఃస్థలమున జిలుగుఁజంమురుసోగవదువున నవమేఘపటలి మెఱపు
చెన్నున నాలయసీమఁ బ్రదీపంపుఁ గళికవైఖరి బోదె నలరుతీవ
చెలువునఁ దరువున ఫలశాఖపోలికఁ, ‡బరమకావ్యంబున వ్యక్తిమూర్తిఁ

* దమ్మమ-మూ. † భోగిపర్యంకుపనుపున-మూ. భోగిపరియంకు అని కవిభావమేమో. అది యసాధువు. ‡ బరమ—మూ.

పులినతలమున మెలఁగెడుపొలఁతిఁ జేరి, తరళలోచనవలనిసత్కార మంది
తుందిలానందమునఁబొందికుందరదన, వదనమీక్షించిమాధుర్య మొదవఁబలికె.

క. కలికి నీనామ మెయ్యది, జలజానన కన్నవారిసంజ్ఞలు కీదృ
క్షులు హేతు వేమి నీవి, పులినంబునఁ దపము సేయఁబూనెడుమతికిన్. ౪౧

గీ. తేఁటియుంటనికుసుమంబు తేట దోఁచు
నీదురూపంబు గనుఁగొన్న నిర్మలాంగి
యర్హవరకాంక్ష దేవతాప్రార్థనంబు
సేయుచుండెద వని నాదుచిత్త మొదవె. ౪౨

గీ. తన్వి యిచ్చటఁ బరమసాధనతఁ గాంచుఁ
దనువిలాసంబె యితరసాధనము లేల
యరసి చూడుము పండితురాలవైన
ఘనఫలావాప్తి *బోధనకన్నఁ గలదె. ౪౩

క. నా విని తమ్ములనేలెడు, దేవునిగాకాపుఁబట్టి తేటమొగమునన్
శ్రీవిభునునగవుసిగ్గులు, తావుకొని మెలంగ నింద్రతనయుని కనియెన్. ౪౪

గీ. †జ్ఞాతృతాధర్మమున కధిష్ఠాన మరయ
నీమరూపంబు ‡గాకున్న మేదినీశ
యాభిరూప్యప్రసిద్ధమాహాత్మ్యమునకు
నధికరణ మాట మాననీయత వహించు. ౪౫

ఉ. కావున నాయుదంత మవికారగుణాకర చిత్తగింపు మే
దేవుఁడు సాయగేస్తుఁడయి తెల్పె జగంబుల కెల్ల §నీను న
ద్దేవుఁడు నన్నుఁ గన్నతఁడు దీపితపాలిరమాధినాథుఁడా
దేవునిఁగా వరించుకొను ధీ కొని యిట్టి వ్రతంబు సల్పెదన్. ౪౬

గీ. అసితరుచి యగునీనది కధిప నేను, జన్మదైశైకతన సహజన్మఁగాను
నామధేయంబుచే నేని నరవరేణ్య, తత్సహోదరిఁగా నన్నుఁ దలఁపవయ్య.

గీ. కర్ణిమిత్రదయాంభోధి నీరజాక్షు, డనఁగ నెఱనమ్మి మదిలోన నతని నునిచి
నాయథాశక్తిఁ గొల్చుచున్నాను నేను, భాగ్యమెట్లున్నదో కాని పార్థివేంద్ర.

క. ఎన్నఁడు పద్మాక్షుఁడు ప్రసన్నుం డయ్యెడునొ కోర్కె సఫలతఁగొను టెం
తన్నఁటికో తెలియదు నిన్, గన్నారం గంటిఁ గంటిఁ గన్నా సుఖముల్.

* బోదన-మూ. † జ్ఞాతతా-మూ. ‡ గాకున్న-మూ. § నీవు.

గీ. అనుచుఁ గన్నీరునించుచు నాననంబు, మిగుల వాంచిన యాతిపై మెఱుఁగుఁబోఁడిఁ
జూచి తలయూఁచి యానందవీచిఁ దేలి, ప్రాఁడిదారబిడ్డ యా*చైత్రరోచి కనియె.

గీ. నిరతిశయ మైన నీ మేని నిరతి మెఱుఁగు, నిర్మలంబైన నీ భక్తి నిష్ఠఁ గూడి
రయము మిగులంగఁ దత్తరగ్రహముఁ గూర్పఁ, దత్తరగ్రహమలవడు సత్త్వములకు.

క. అని పల్కి కలికి యానుమతి, గని తూరుపు వాఁటి వేల్పుఁ గనినయుదారుం
డనితరలబ్ధామోదం, బని తలయూఁచు మను వేగ హరిఁ గనవచ్చెన్. ౫౨

క. †వచ్చిన వచ్చెలు వచటికి, వచ్చి(న) కార్యంబు రూపవైఖరి మదిలోఁ
బొచ్చెంబు లేని భక్తియు, ముచ్చటకడి యడుగ సకలమును వినుపించెన్.

చ. చెలికల వార్త యిట్లతఁడు చెప్పినఁ దప్పక యాలకించి యా
జలరుహపత్రలోచనుఁడు చక్కఁగ లేనగుఁబువ్వునీటిచే
నలఁతిఁ దొలంకుప్రేమమున నాననపద్మము కన్నుదోయి మే
లోలయఁగ నింతిఁ జూడ మది కొప్పగునం వొగి నేగి యచ్చటన్. ౫౪

—శ్రీకృష్ణుడు కాళిందిం గొనిపోవుట—

క. శృంగారైకాశ్రయమా, నంగన నెమ్మేను చూచి హరి నవరసపా
రంగత ‡మగునను భూతిచె,లంగఁగఁ దా మెలఁగె నబ్బురంబు దలంపన్.

సీ. నీలాభ్రమునఁ జాలు నెఱికప్పుజిగిజాలు మేలు నవ్వఁగఁ జాలు మేనివానిఁ
జలతలేక లసించు తొలినాఁటి బయిమించు నొప్పు నేరము తెంచునొల్లెవానిఁ
దొలుత వేళ నెసఁగు జలజాతములరంగు గలకన్నులబెడంగు గనెడువాని
నమృతధారలు చిల్కు నట్టిచందురుకుల్కు, నగెడు నవ్వులతళ్కు మొగమువాని
లచ్చి పేరాది గలపేరు మచ్చవానిఁ, గౌస్తుభకిరీటము ఖపరిష్కరణవాని
సుడికి నీడగు నొకవాలు వడయువానిఁ, బిందుకన్యానఁ గన్న గోవిందుఁ గనియె.

గీ. కనియు ర్వనితరహృద్ధ్యానఘటితసర్వ, దేశసంతతదివ్య త్త్వదీయదివ్య
రూపజాలంబులోనఁ దద్రూపమపుడు, మిళితముగఁ గొంత సేపింతి మిన్నకుండె.

క. అంతటఁ గాంతకు లక్ష్మీ, కాంతుని నిజరూపగరిమ గనవయ్యెఁ దదే
కాంతి(క)దృష్టిప్రభావత, పొంతఁ బురందరుని కట్టి పొసఁగుట చేతన్. ౫౭

చ. హరి నిజరూపమాత్మ ముదమారఁగఁ గాంచిన కాంచనాంగి కిం
బరిచితిఁ జెందవయ్యె నభివాదనవార్తలు నాస్తవక్రియల్

---

*చిత్రరోచి- †వచ్చి యచ్చెలువ యుచటికి ‡ మగునను భూతి ర్వనీరతహృ-మూ.

కరము మనంబులోపల నఖండితభక్తి కుదిర్చ నజ్జకున్
హరిహరి యనుచుఁ గనిపట్టికచాకచి సాఘటిల్లఁగన్. ౫౯

గీ. వెలఁది "యద్భ్రూగతః స్వయం విష్ణు"రితి వి
చారసాంగత్య మొనరఁగఁ జలదసాంగ
వీక్షణాంభోజమాలికావినయములను
బూజ యొనరించె నాజగత్పూజితునకు. ౬౦

గీ. కృష్ణఘనరుచి దనచాతఁ గీలుకొనఁగఁ
జాముముఖచంద్రుఁ డప్రకాశత వహించె
నిమదక్రేఁగంటిచూపులు నీలవేణి
రుచివిలాసంబు దన్మౌళిరుచి గొనంగ. ౬౧

గీ. అంబుజాననయుఁ జకోరాక్షి యనుట, నిజముగాఁ జేయఁదలఁచి యానీరజాక్షు
వదనచంద్రుని బాయు కవ్వారిగాఁగ, బాలుకొనఁజేసె దనదృక్చకోరకముల.

చ. అపుడు ముకుందుఁ డింతిఁ గని యంబుజమిత్రతనూజ నీకు ని
త్తపము ఫలించె రమ్మనుచుఁ దమ్ములఁ జేనగు మోము గ్రమ్మఁగాఁ
* దవనతనూభవం జెనుట తద్దయుఁ గ్రమ్మ రథంబుమీఁదఁ దాఁ
గృపనిముకొంచు ధర్మజుని కేళిపురంబున కేఁగె నెమ్మిగన్. ౬౩

క. అచ్చట నారాజున కచ్చుచ్చట దెలియఁగఁ జేసి భూపతిమదిలో
ముచ్చట దీరఁగఁ గొన్నాళ్ళచ్చపుఁ బ్రేమమున నిలిచి యదుపతియంతన్.

క. పురమున కేఁగుతలంపున, నరవరునానతి గ్రహించి నలువారఁగ న
న్నరుఁ దోడ్కొని చనువేడ్కల్, పురణింపఁగ డాయఁజేరి భూపతిఁ బలికెన్

గీ. అనఘకృతి యపార్థ మగు నేని పండిత
హృదయమునకుఁ బోలె హితము గాదు
నామదికి నెపుడు నరుఁ బాపు మటు గాన
నన్నుఁ బాపి రాఁగ నరవరేణ్య. ౬౬

వ. ఇట్లు బావయగు తోవకమ్మకొలంగును బావబిడ్డబిడ్డని చే †సోమాసుల
వెట్టుంజెట్టుపట్టి తనవెనుకటిరాకకు నాఁతివడసి యతండు రా ‡నయ్యోడ్డ
కేంద్రారబిడ్డ ప్రామిస్సుసొమ్ముబరణి గన్నకన్నె గొని నిజపరివారపరివృ
తుండై కదలి సాంద్రంపుటగడిత పడయు బెడంగుప్రోలు మేలుబాతికిం జని

* తపనతనూభవత్ జ.ఋ.ఋ. యూ. † సోమా ౬ ౨ ‡ రయ్యాంరకేంద్రాబిడ్డ

ఉ. సందడి జాల భూ(క)వరసంతతభూషణబద్ధరాగముల్
పొం దగునందుఁ గుఁజిప్పరుబోఁడె లటంచు గజంబు లూని యీ
సొందుచు మీఁదికింబఱుప నూర్ధ్వతలంబున నిల్చె నవ్వి రా
నంములు లేక తగ్గ్రుచులు సాఁకును రక్తవితానరోచులన్. ౭౭

సీ. వితతవజ్రోపలావిరళకీలితములు మున్న వీథులు పంకమునకుఁ జొరవు
బహుళమహాదారభద్రేభదానవారాపగాపూర్ణంబు లయ్యె నిపుడు
బహుళమహోదారభద్రేభదానవారాపగల్ పయుగ్రమ్ము సమితనృపతి
సంబాధహేతుకసంఘర్షణచ్యుతచారుసౌవర్ణభూషణరజంబు
లెనయ నవి పంకమై *నారకేర్లఁబోలఁ దత్క్షణంబునఁ దద్వృత్తఁ దాల్చె వీథు
లంతటన పంకతవహించె సమిత †జన్మి, బహుళసన్ముజనితోష్మబలముకతన.
గీ. లక్షణాఢ్యగణస్థూలతలంపుఁ దనరె స్వసమర్పణము పరార్థంబుగాఁగ
సకలకృశలక్షణులయందు సధివసించెఁ జెన్నుగ స్వసిద్ధికై పరాపేక్ష మచట.
క. చిత్రవ్యక్తుల నట వా,క్చిత్రాభి‡వ్యక్తు లేమి చిత్రం బగునే
చిత్రవ్యక్తులఁ జిత్రము, చిత్రధ్వనియుత నర్థచిత్రత మెఱయన్. ౭౮

— శ్రీకృష్ణుని మంగళస్నానము. —

ఉ. అంతట గర్గముఖ్యు లగునట్టి మహీసురు లెల్ల వచ్చి శ్రీ
కాంత సమీపవర్తి యయి కానఁగనయ్యె ముహూర్తవేళ మీ
రింతట జాగు మానఁ దగు నిచ్చ శుభార్థపుమజ్జనంబుపై
నింత వసింపఁ జేయు మన నీహిత మొప్పఁగ మాధవుం డొగిన్. ౭౯

క. అంజనగిరితుల్యుండు ని, రంజనుఁడు జగంబులెల్ల నంజలు లిడఁగాఁ
గుంజరగతి వచ్చుచు న, భ్యంజనమున కతులపీఠి నాసీనుఁడుగన్. ౮౦

ఉ. వన్నెలుమీఱు గొన్నచెలువం గొని పొంగుచు నస్మదాదులం
గన్నయనాదిపూరుష యఖండమహోదయ యిట్టి పెండ్లి నీ
కెన్నఁగఁ దన్మహామహిమ నే కద గాన భరింపు మామె నం
చన్నలినోద్భవాదిసుర లచ్యుతునోఁదలఁ బెట్టి రక్షతల్. ౮౧

చ. దరము దరంబు నిచ్చు రొదఁ దాల్చును దా సరిగాదు సీతవ
ల్లరియుఁగ మేళవింప నగు నస్ఫురితాక్షర మద్ది సాటియే
సురుచిరపర్ణవస్త్రధుఃసూక్తిగళంబుల కంచు నెంచ న
వ్వురముని చెంత నంగనలు పాటలు పాడిరి నెర్పుమీఱఁగన్. ౮౨

---

* నారికేళ్ల(ప్రా)ల. † జ.౬. ‡ వ్యక్తిలేమి.

# కాకినాడ-పరిషత్కార్యాలయమున వెలకు దొరకు

# గ్రంథములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | విప్రనారాయణచరిత్రము-చదలువాడ మల్లయకవి | రు. 0 | 8 | 0 |
| 2 | కవిజనాశ్రయము-వేములవాడ భీమకవి ... ... | 0 | 10 | 0 |
| 3 | చంపూరామాయణము-ఋగ్వేదికవి వేంకటాచలపతికవి ... | 1 | 0 | 0 |
| 4 | నీతిసీసపద్యశతకము-తాళ్లపాక పెదతిరుమలార్యుడు ... | 0 | 2 | 0 |
| 5 | జ్యోతిశ్శాస్త్రసారము-శ్రీమాన్ కపిస్థలం కృష్ణమాచార్యులుగారు బి. ఏ., యల్. టి. ... ... | 0 | 8 | 0 |
| 6 | జ్ఞానప్రసూనాంబికాశతకము-శిష్టు సర్వశాస్త్రికవి ... | 0 | 2 | 0 |
| 7 | సర్వేశ్వరశతకము-యథావాక్కుల అన్నమయ్యగారు ... | 0 | 3 | 0 |
| 8 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము-జ. రామయ్యపంతులు గారు, బి ఏ., బి. ఎల్. ... ... | 0 | 8 | 0 |
| 9 | కావ్యాలంకారచూడామణి-విన్నకోట పెద్దయకవి | 0 | 8 | 0 |
| 10 | చంద్రభానుచరిత్రము-తరిగొప్పుల మల్లనకవి ... | 1 | 0 | 0 |
| 11 | అకారాద్యముద్రితగ్రంథసూచిక ... ... | 0 | 6 | 0 |
| 12 | ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ... ... | 0<br>0 | 12 | 0 |
| 13 | శివతత్త్వసారము-మల్లికార్జున పండితారాధ్యులు ... | 0 | 12 | 0 |
| 14 | Defence of Literary Telugu జయంతి రామయ్యపంతులుగారు బి ఏ., బి. ఎల్. ... ... | 0 | 8 | 0 |
| 15 | శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి ... ... | 0 | 12 | 0 |
| 16 | ఆర్యభాషావిభాగము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ... ... | 0 | 8 | 0 |
| 17 | Dravidian Lexicography ... ... | 0 | 4 | 0 |
| 18 | ప్రాస్వరంగములు-క్రొత్తపల్లి సూర్యరావుగారు... ... | 0 | 8 | 0 |
| 19 | నారసింహపురాణము ఉత్తరభాగము-హరిభట్టు ... | 1 | 0 | 0 |
| 20 | మన్నారుదాసవిలాసనాటకము— రంగాజమ్మ. ... | 0 | 8 | 0 |
| 21 | జైమినిభారతము-వచనము-వేంకటకృష్ణప్పనాయకుడు ... | 0 | 12 | 0 |
| 22 | కాం॰ టీకవ్యాకరణము (మొదటిభాగము) అహోబలపతి | 1 | 0 | 0 |
| 23 | రెడ్డినాటి రెండుశాసనములు శ్రీనాథుడు ... | 0 | 4 | 0 |

Printed by M. Rangiah at the Cocanada Printing Works, Cocanada.